ర్వ్యంకనుతనాగకరకంకణవిరాజితక
ళంక గిరిజాకుచ శుభాంకపరివిలస
త్పంకితనితాంతపులకాంకిత యురస్థ్సలమృ
గాంకశతకోటినిభ పంకజదళాక్షా. 232

క. త్రిపురాటవీ ధనంజయ
త్రిపురాసుర ఘోరశైల దేవాధిపతీ
త్రిపురాంబుధి బడబానల
విపులదయాంభోధిచంద్ర విశ్వస్తుత్యా. 233

మాలిని —

అఖిలభువనపాలా హస్తకాంతత్రిశూలా
శిఖినయనలలాటా శీతధామార్ధజూటా
నిఖిలనిగమసంగా నిర్వికారాంతరంగా
మఖసమయవిజృంభా మంగళస్ఫూర్తిధామా. 234

గద్య. ఇది శ్రీమన్మహామహేశ్వర యివటూరిసోమనారాధ్య దివ్యశ్రీపాదపద్మారాధక కేసనామాత్యపుత్త్ర పోతయనామధేయప్రణీతంబైన శ్రీవీరభద్రవిజయం బనుమహాపురాణ కథయందు దక్షయాగంబును దధీచివివాదంబును దేవతల పరాజయంబును వనజనయన వనజభవప్రముఖులు మహేశ్వరుని స్తుతించుటయు వారల మహేశ్వరుండు కరుణించుటయు నన్నది సర్వంబును జతుర్థాశ్వాసము.

వీ ర భ ద్ర వి జ య ము
సం పూ ర్ణ ము.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1942.